# అంకితము

## మిత్రుఁడు కొల్లిపర సూరయ్యకు

వర్ణవైషమ్యంబు వాడిపోయిన దయ్య
అర్ణవవైశాల్యమైన నీ యాత్మలో

శారదజ్యోత్స్నా వర్షాతుషారమ్ములు
నీ రమ్యమూర్తిలో నిగ్గుతేలిన వయ్య

చిగురువేదములు వాసించు నీ లోపల
నగరయ్యెలే యశోనవ్యవల్లగులకు

రమణీయపూర్వసారస్వతప్రేమలో
కమనీయుఁడైన భాగస్వామి వైనావు

విశ్వనాథ సత్యనారాయణ
కొడాలి ఆంజనేయులు

# పాత్రలు

కీచకుడు

శారద్వతుడు

కంకభట్టు

తంత్రీపాలుడు

వలలుడు

ద్రౌపది

సుదేష్ణ

ఉత్తర

వల్లకి

దాసి

# ప్రథమాంకము

## నాంది

ఆర్తత్రాణపరాయణత్వమున హైమాంబుప్రవాహోద్ధమై
ధూర్తప్రాణహరత్వనిష్ఠ మెయి నద్భూతార్చిషం బై జగత్
కర్తృత్వాదుల కేక కారణము నై కామాగ్నికుండంబు నా
తార్తీయీకము శైవలోచనము సంధానించు నైశ్వర్యముల్

అనులయనృత్యదాత్మవృషభాధిప మగ్రజటాసముల్లస
త్ఫణభుజగాభిరామము రవమ్మగజోద్గతశబ్దశాస్త్రకా
రణము క్రమప్రకాశమధురస్వర మూర్జితమైన శ్రీప్రలో
చను నవసాంధ్యతాండవము సాధుమృదూక్తుల మాకొసంగుతన్

(నాంద్యంతమున సూత్రధారుఁడు)

ఆలస్య మేమియును లేదు. పరిశ్రమద్వ్యాప్తముఁ నే బద్ధ ప్రణయుఁ డగు నాయకుంబోలె నీ నాటకమునెడ ప్రథమ పరిచయముననే బద్ధాదరుల మయిన మేము, దీనివిషయ మేమి యయినను జెప్పుటకూడ న్యాయముగాదు. అయినను నా కావ్యము నాదరభావముతోఁ బరిశీలించుటకుఁ బ్రియామూర్తులైన పారిషదులఁ బ్రసన్నులం జేసికొనెదము.

మున్ను కలశాంబునిధిఁ ద్రచ్చుకొన్న యప్పు
డా మహాదేవి జనియించె కామధేను
మూర్తి సాక్షాత్సరస్వతి పుణ్యరాశి
ఆమె కపరావతారము లంట మీరు (తెర)

# ప్రథమాంకము

ప్రవేశము—కీచకుడు, ద్రౌపది, త్రస్త

కీచకుడు :

మద్భుజార్జిత ధారుణీమండలంబు
ఏలుచుండె విరాట ధాత్రీశ్వరుండు
శత్రునృపతులు మత్స్యదేశముల పైని
దృష్టి పఱుపరు నా కంటియెఱుపుఁ జూచి

నాకు సుదేష్ణ తోఁబుట్టువు. నా పేరు సింహబలుఁడు. ఈ యంతఃపురమున నీవు క్రొత్తదానివలె నున్నావు. పేరడుగవచ్చునా?

ద్రౌ: (మౌనము)

కీచ: నేను మా యక్కగారి యంతఃపురమునకు వచ్చి సంవత్సరము కావచ్చినది. అప్పుడు నిన్నుఁ జూడలేదు. ఏలనో నిన్నుఁ జూచిన నీతో మాటాడవలె ననిపించినది. క్రొత్తఁగ [illegible]ని సంశయించితిని.

ద్రౌ: (మౌనము)

కీచ: ఈ జాజిపూవుల తావి యెక్కడిది? నీ మేనిదియా? నీ వెన్నాళ్ళయినది యిక్కడకు వచ్చి? మా యక్క నీచేత నేమిపనులు చేయించును?

ద్రౌ: (నిష్క్రమించును.)

సుదేష్ణ: (ప్రవేశించి) నాయనా! ఎప్పుడు వచ్చితివి!

కీచ: ఇప్పుడే వచ్చితిని.—ఇటుల వెళ్ళినది. ఆమె వ్వరు?

సు: నీవు మా బావగారికిఁ గనఁబడితివా?

కీచ: కనబడ లేదు. ఆయమ యెన్నిదినము లైనది యిచ్చటకు వచ్చి?

సు: ఎవ్వరో పరిచారిక! ఇంటివద్ద నందఱు బాగుగ నుండిరా మనవాండ్రు?

కీచ: బాగుగనే యున్నారు. ఆ కాంత యెవ్వరు?

సు: ఆమె యెవరో సత్కులీన. తమ్ములందఱు బాగుండిరా? అమ్మతిరుగుచున్నదా? విశ్రమసుఁ డాడుకొనుచున్నాఁడా?

కీచ: అక్కా!

ఆ మనోహర దివ్యరూపాతిశయము
మానవాంగనలందు సామాన్య మగునె?
యెచట దొరకించుకొంటివో యీవు సేవ
కప్సరఃకాంతసౌభాగ్యమౌ నాభరణము?

సు: నీ కేమైన పిచ్చియా? మీ బావగారు నీకుఁ గబురంపించ నెంచుచున్నారు! నీవే వచ్చితివి.

కీచ: ఆయమ యెవ్వరో చెప్పవు?

సు: ఉత్తర నిన్నుఁ జూడవలెననుచున్నది. దానిని దీసి కొని వచ్చెదను. నీవు నా గృహమువద్ద నుండుము. (నిష్క్ర.

కీచ: ఎంత పలుకరించిన మాటాడ లేదేమి? ఆచూలలోఁ హాసమున్నది. కాని యది క్రొత్తడితన మేమో! ఆ వదనాంచలము లేవి. యా శరీరరేఖ లేమి? యెంతటి సౌందర్యసభావములు!

ద్రౌ: (ప్రవేశించి) సుదేష్ణాదేవి యిచ్చట లేదే! పూలదండ నామె కియ్యవలెనన్న నామె యెచటి కరిగినదో!

# ప్రథమాంకము

ప్రవేశము—కీచకుడు, ద్రౌపది, స్త్రీ

కీచకుడు :

> మత్స్యజాంగిత ధారుణీమండలంబు
> నేలుచుండె విరాట ధాత్రీశ్వరుండు
> శత్రునృపతులు మత్స్యదేశముల పైని
> దృష్టి పఱుపరు నా కంటిచేయుటుప్పఁ జూచి

నాకు సుదేష్ణ తోఁబుట్టువు. నా పేరు సింహబలుఁడు. ఈ యంతఃపురమున నీవు క్రొత్తదాసివలె నున్నావు. నీ పేరడుగవచ్చునా ?

ద్రౌ : (మౌనము)

కీచ : నేను మా యక్కగారి యంతఃపురమునకు వచ్చి సంవత్సరము కావచ్చినది. అప్పుడు నిన్నుఁ జూడలేదు. ఏలనో నిన్నుఁజూచిన నీతో మాటాడవలె ననిపించినది. క్రొత్తఁగా యని సంశయించితిని.

ద్రౌ : (మౌనము)

కీచ : ఈ జాజిపూవుల తావి యొక్కడిది ? నీ మేన నుండియా? నీ వెప్పుడైనది యిక్కడకు వచ్చి? మాయక్క నీచేత నేమిపనులు చేయించును ?

ద్రౌ : (నిష్క్రమించును.)

సుదేష్ణ : (ప్రవేశించి) నాయనా! ఎప్పుడు వచ్చితివి?

కీచ : ఇప్పుడే వచ్చితిని.—ఇటుల వెళ్ళినది, ఆమె యెవ్వరు ?

సు : నీవు మీ బావగారికిఁ గనంబడితివా ?

కీచ: కనబడ లేదు. అయ్యమ యెన్నిదినము లైనది యిచ్చటకు వచ్చి?

సు: ఎవ్వరో పరిచారిక! ఇంటివద్ద నందఱు బాగుగ నుండిరా మనవారలు?

కీచ: బాగుగనే యున్నారు. ఆ కాంత యెవ్వరు?

సు: ఆమె యెవరో సత్కులీన. తమ్ములందఱు బాగుం డిరా? అమ్మ తిరుగుచున్నదా? విశ్రవసుఁ డాడుకొనుచున్నాడా?

కీచ: అక్కా!

ఆ మనోహర దివ్యరూపాతిశయము
మానవాంగనలందు సామాన్య మగునె?
యెచట దొరకించుకొంటివో యీపూవు సేవ
కస్తురికింతయోగ్యమౌ నాభరణము?

సు: నీ కేమైన పిచ్చియా? మీ బావగారు నీకుఁ గబురంపించ నెంచుచున్నారు! నీవే వచ్చితివి.

కీచ: అయ్యమ యెవ్వరో చెప్పవు?

సు: ఉత్తర నన్నుఁ జూడవలెననుచున్నది. దానిని దీసికొని వచ్చెదను. నీవు నా గృహమువద్ద నుండుము. (నిష్క్ర)

కీచ: ఎంత పలుకరించిన మాటాడ లేదేమి? ఆచూపులలోఁ ద్రాసమున్నది. కాని యది క్రొత్తదితన మేమొ! ఆ వదనాంచలము [illegible] యా శరీరరేఖ లేమి? యెంత సౌందర్యనిధానములో!

ద్రౌ: (ప్రవేశించి) సుదేష్ణాదేవి యిచ్చట లేదే! ఈ పూలదండ నామె కియ్యవలెనన్న నామె యెచటికి కరిగినదో?

కీచ: (చూచి) అహా! మల్లెలు సిగముడినే పడుచు
చున్నది. (సమీపించి) ఆ పూమాల నిన్న కూర్చిన దేనా? అవును! నిన్న కూర్చి యుందువు! లేకున్న వాడియుండ దెట్లు-డిది దానికి? అది యెవరికొఱకు గ్రుచ్చితివి?

ద్రౌ: (స్వ) పొరబాటున మాటల నితని గలసికొంటిని.

(పోఁబోవును)

కీచ: (అడ్డువచ్చి) చెలి! ఇదియేమి? నీకోమలశరీరముపవాసకృశీభూతము చేయుచున్నావు! ఈమేను మాత్రము తపోయోగ్యమైనది కాదు. కంది, వాడి. మెత్తబారినది.

ద్రౌ: (తొలఁగి పోఁబోవును.)

పరిచారిక: (ప్రవేశించి) స్వామి. కీచకమహారాజ! దేవి యుత్తరాసహితయై తమ్మెదురు చూచుచున్నది.

కీచ: (స్వ) ఈమెవిషయము మాయక్కగారివలనఁగాని బోధపడునటుల లేదు. (ప్ర) ఆమె యెక్కడ నున్నది?

పరి: వసంతపాలికోద్యానమున!

కీచ: (నిష్క్రమించును).

ద్రౌ: ఇతఁడు ముందచ్చటికిఁ బోవును గాబోలు. నేనేల వీని వెంటఁ బోవలయును? తరువాత నీసంగతి సుదేష్ణతో విన్నవించెదను.

కుడికన్నదరుచున్నది. ఇది బాగుగాఁ బట్టిన మసుపే కావలయును. ఇత డెవరై యుండును?

పరి: ఏమమ్మా సైరంధ్రి! ఏమో యాలోచించుచున్నావు?

ద్రౌ: ఏమియు లేదు. సుదేష్ణాదేవి యెచ్చటకు వెళ్ళినది?

పరి: మహారాజ! కీచకస్వామి వచ్చెనని యాయుష్మంతురా లుత్తరను దీసికొని వచ్చుటకు నర్తనమందిరమునకు వెళ్ళినది.

ద్రౌ: ఆమె వెళ్ళుట యేల? పరిచారికలు లేరా?

పరి: కీచకస్వామి యెడ నామెకుఁగల సౌదర్యమువలన!

ద్రౌ: ఎవరీ కీచకుఁడు మున్నెన్నఁడు వినలేదు.

పరి: కొంచెము గౌరవముగా మాట్లాడుము. ఆయన నామము నిరుపపదముగా నుచ్చరింపరానిది.

ద్రౌ: క్షమింపుము. ఆయన యెవ్వరు?

పరి: సుదేష్ణాదేవియు, నాయనయుఁ బినతల్లి పెదతల్లి బిడ్డలు.

ద్రౌ: ఆయన యిప్పు డెచటనుండి వచ్చినారు?

పరి: ఆయన నివాసము విరాటనగరముననే కాని యీ రాజమందిర మీపట్టణమున కావైపునుండును. ఎందుకు నీ వాయనను గూర్చి ప్రశ్నించెదవు?

ద్రౌ: పురుషులకుఁ బ్రవేశింపరాని యీ యంతఃపురము నీతఁ డెట్లు ప్రవేశించినాఁడు? భూమింజయాది రాజకుమారులే ప్రవేశింపరాదే?

పరి: ఆయనకు సుదేష్ణాదేవి యెడఁ గల చనవట్టిది. అదియుఁ గాక యాయన భుజాబలమే మత్స్యధాత్రీతలమునకు రక్ష.

ద్రౌ: (మౌనము)

పరి: అతఁడు నూఱుగురు తమ్ముల కన్న. సకలపరివారముతోడ నతఁడు కొలువున నిలిచినచో విరాటుఁడు కాదు రాజు; ఆయనయే.

ద్రౌ: దుర్యోధనునకు నితనికి మంచిపోలిక యున్నది.

పరి : ఆయన మానవతీపంచబాణుఁడు.

ప్రౌ : నేను దేవిగారిని గలసికొనవలెను. (నిష్క్ర)

పరి : సైరంధ్రి మొదలు తానేమో నన్నాసినుగూర్చి యడిగెనది. నేను గొంచెము సూచించిన విముఖావలె నటించినది. కాషాయవస్త్రములు కల్మషము దాచగలవు.

ఉత్తర : (ప్రవేశించి) ఓసీ! వల్లకీ! సామాను జాతీ కుసుమములు కోసికొని రమ్మా. పూలమాల గ్రుచ్చవలె.

పరి : అమ్మా! తమకై వారు దయచేసిరే! తమకుఁ గనఁబడలేదా?

ఉ : ఆయనను బృహన్నలవినా నేను దర్శించను.

పరి : సైరంధ్రి యొద్ద నొకఁడున్నాఁడు.

ఉ : పోయి తీసికొనిరమ్మా!

పరి : (నిష్క్రమించును.)

ఉ : (స్వ) ప్రస్తావనలో బృహన్నలోపాధ్యాయులు సైరంధ్రిని దాము మున్నెఱుఁగుదుమనియు, హస్తినలోఁ దాము శ్రీ యుధిష్ఠిరచక్రవర్తి యాస్థానమున నాట్యాచార్యులుగా నున్నప్పుడీ సైరంధ్రి యచటనే యుండెడిదనియుఁ జెప్పి యామెను గూర్చి మిక్కిలి గౌరవముగఁ బ్రసంగించినారు. ఆమె గ్రుచ్చిన పూమాల నాచార్యున కొసంగిన బాగుగనుండు దేమో! (ప్ర) వల్లకీ! వలదు. నీవు పోయి పూచిన యా మందారవద్ద నున్న జాతులు తీసికొని రమ్మా!

పరి : (జాతులు తెచ్చి యిచ్చును)

ఉ : ఆహా! ఈ జాతికుసుమవాసన లెంత మనోహరముగ నున్నవి.

ప్రవేశము. సుదేష్ణ—కీచకుఁడు

ఉ: మామా! ఈపూవులు నీకై తెచ్చితిని.

కీచ: అమ్మా! సౌభాగ్యవతివి కమ్ము.

సు: తల్లి! మామయ్యను నమస్కరింపుము?

ఉ: (అట్లు చేయును.)

కీచ: (లేవదీసి) అమ్మాయికి నాట్య మెంతవఱకు వచ్చినది? మొన్న నెపుడో చూచినా నీయమ గురువును. మనోహరముగ నున్న దామూర్తి. సాహిత్యతేజ మాతని మొగమున గంభీరముగ నున్నది.

అక్కా! అమ్మాయికిఁ బెండ్లి యెప్పుడు!

సు: కళ్యాణపు గడియలు రావలయును.

కీచ: ఉత్తర సిగ్గుపడుచున్నది. ఎప్పుడు నేర్చితివమ్మాయిని. ఆ గురువు నేర్పినా యేమి?

ఉ: (స్వ) మామ మిక్కిలి రమ్యముగ మాటలాడుచున్నాఁడు. ఇతనిని గూర్చి కొన్నివదంతులు చెడ్డగా నున్న వేలనో!

కీచ: అమ్మా! నీవు బాగుగాఁ జదువుకొనుము. ఇది తీసికొమ్ము. (అని మెడలోని హార మిచ్చును.)

ఉ: (గ్రహించి) పాఠశాలలోఁ బుస్తకములు వదలి వచ్చితిని. సెలవు తీసికొందును.

సు: నల్లకీ! నీవు తల్లి వెంటఁ బొమ్ము!

(వల్ల-ఉత్తర-నిష్క్ర)

సు: నాయనా! నీవు నాట్యశాస్త్రమున మహాప్రజ్ఞ కలవాఁడవందురుగా! అమ్మాయి నేమియుఁ బరీక్ష చేయలేదేమి?

కీచ:_సోదరీ!

ప్రథమ దర్శనమై యింతవఱకు నెందు
గడియ సేపయినఁ గాలేదు కలఁగిపోవు
చున్నయది నాహృదంతరం బూఱడిలక
అంత సౌందర్యవతి యా లతాంగి యెవరు?
అప్సర స్త్రీల సమాజంబు లో వెలంది
కాలిగోటికి కేనియుఁ సరిగారనుట్లు
ప్రకృతిలో నున్న సౌభాగ్యభాగ్య మెల్ల
సలపరించు కొన్నది యా లతాంగి యెవరు?
ఏడుదీవుల రాజ్యంబు లేలుబడికి
చిహ్నమైన కిరీటంబు శిరమునందుఁ
దాల్చుటకు యోగ్యమైన దా తలిరుబోఁడి
యంత తేజమ్ము కల దా లతాంగి యెవరు?

సు: పరస్త్రీప్రశంస పాపహేతువు కాని యింకొక విషయము మాటలాడుము. ఆ భాగ్యశాలిని యెవరో పాపము, మన యంతఃపురమునఁ దల దాచుకొన వచ్చినది.

కీచ: అక్కా! క్షమింపుము! ఏమి చేయుదు నమ్మా!

ఈ శరోరంధ్రముల నింగునెత్తుచున్న
దసమమార్గణము రజ్జుశాఖిగముల
వేగముగఁ జేసి సుడివడ వీచుచున్న
గాలి చేసిన యట్టి యుగ్రస్వనంబు.

సు: ఒకప్పుడు చిత్తవికారమేర్పడినను, దానిని స్వాధీన పఱచుకొనవలయును. మఱల నా ప్రశంసఁ దేకుము.

కీచ: అక్కా!

సు: రాజాంతఃపురములయందిట్టి యిక్కట్టు లున్నవని యీ యావిడ తొలుత నావద్దఁ బ్రవేశించుచున్నప్పుడు, తన్ను గౌరవముగా చూడఁగలిగిననే నావద్దఁ బనిచేసెద నన్నది. ఈ

రో న్నిబుది నెలలనుండి చూచుచుంటిని. ఆమె తులసిమొగ్గ వంటిది. ఆమె సైరంధ్రీవ్రత మవలంబించుచున్నది.

కీచ: అక్కా! నా ప్రాణసమానమైన యాశ వదలుకొమ్మనెదవా?

సు: అబ్బా! ఇదేమి? ఆమె మొగముఁ జూచినంతఁ బూజింపవలెనను భావము కలుగును గాని యిట్టి దురూహాలు నీ కెట్లు పుట్టినవి?

కీచ: నా కామె పాదాభివందనముఁ గూడఁ జేయవలె ననియున్నది.

సు: ఆమెను విరాటనృపతి యంతఃపురము తలదాచు కొనసైనది. ఈయంతఃపురము నీ యీ దుష్టభావమున కామెను లోఁబఱచదు.

కీచ: కాక నా ప్రాణములు త్రుంచుకొనిపోవు నా మఱి.

సు: నాయనా! ఈ యధర్మమునకు నన్ను లోఁగఁదీయకుము. మహాపౌరుషశాలివైన నీబుద్ధి పరకాంతలపై నేల ప్రసరింపవలె?

కీచ: అక్కా! ఈ మానస్వాంతవలఱు నన్ను బాధించు చున్నది! ఆ మనోహారిణి పేరైన వినఁజాలనేని నా యీజన్మ మెందులకు?

సు: అది నాకుఁ దెలియదు. ఆమె సైరంధ్రీవ్రత మాచరించుచున్నది. కాని నామె నిందందఱును సైరంధ్రియనియే వ్యవహరింతురు. నీ వింత పిచ్చిలో నున్నావుగాన నీ కొక మాట చెప్పెదను. ఆమెకుఁ బతులుగలరఁట. వారు గంధర్వులు. అయిదుగురు. మహాబలశాలులు. వాయుసమానవిక్రములు.

అతిశయితబాలకేతకీ మైత్రప్రభాతి
చంద్రికాసితనవనీతసౌకుమార్య
మై శరత్కాలసితజలవాహ మగుచు
నా హృదంతరమూలఘనంబు గాలిచె.

ద్రౌ: (ప్రవేశించి) సుదేష్ణాదేవి యీనాఁ డేకు నొంటరిగా నున్నదా? అంతఃకరణమునఁ బ్రొద్దు గ్రుంకుచున్నది. ప్రొద్దు గ్రుంకకమునుందే సుదేష్ణాదేవితోఁ జెప్పవలయును. (పరిక్రమించి) అహో! నేఁడు నా దౌర్భాగ్యమే మో! ఇతని నొంటరిగాఁ గలసికొంటిని. ఇందు సుదేష్ణాదేవి యున్న దని చెప్పినదే పిల్లకి! దాని ప్రసన్నత బాగుగ నుండ లేదు. తొలఁగి పోయెదను గాక!

కీచ: ప్రేయసీ! నన్నేల త్రిప్పలు వెట్టెదవు?

ఒకమాట పలికి సంతస
సకియా! ముత్తెముల వసువ జారిపడునటే?
ప్రకుపితనేత్రద్యుతియు
క్రకచంబుల నన్నుఁ గోయఁగా నేమిటికే?

పలుకంగరాదె యో ప్రాభాతవేళామృతస్యందినీజాతసమువచన!
ననుఁ జూడరాదె యో నవ్యశారద కౌలసితనవాంభోదశకల్పితశ్లోకత!
చిఱునవ్వరాదె యో శ్రీకరచ్ఛవిదీప్తతరుణకతోన్నిద్రకుందపంక్తి!
సుంత నిల్వగరాదె శోభాకమనీయమధురిమ రాగసంపన్న మూర్తి
యెంత నిర్దయురాలవే యిగురుబోడి?
తావకీన సర్వాంగసౌందర్యమందుఁ
బ్రకటమార్దవ ముండియుఁ బైకిఁ జింతి
కఠినతామార్గ మేల కైకొంటి వింతి!

దేవీ! కన్నెత్తి చూడుము! నీదృగంతభాగీరథీవాహి నిలోఁ బవిత్రుడనై పోయెదను స్నానములాడి.

ద్రౌ: అన్నా! ఏమిది! ఈవికృతాకార మేమి? నేనేమి? నన్నుఁ జూచిన నీకు మదనవికారమా? నీకుఁ బరియాచించు

బాహ్యస్మృతిగలిగిన నావంటి పిచ్చివాండ్రెవరో నా యాపన్నతె! దేని నుద్దేశించి యొసగినావు. నాకుం బని యున్నది. శ్రీఘ్రముగ బోయెదను!

కీచ : ఓహో! శాంతాలంకార రేఖ! ఎంత మాటాడితివి! నీ కృపాపాంగములకై వేచి యున్న నా పైని నన్నేల కటువు మాటలాడి విముఖుని జేసెదవు?

మాధుర్యమా! నన్నేల నీలో నొక భాగమునకుం జేర నీయక విషమ్ము నందించెదు? సామాన్యముగఁ బురుషు లిట్లే ప్రథమమునఁ బ్రేమావేశముం జూపి యనంతరము పరిత్యజింతు రనుకొందువా! మనోహారిణీ! ఇదె చెట్టపట్టుకొనెదను.

రమ్యజలదమాలానీలసౌమ్యగగన
భాగరమణీయమైన యీ శ్రావణమునఁ
దీరుగాఁ బూఁచినట్టి మందారమిదిగొ
యీ శిరోభాగమున కరం బిడిగొ యుంచి!

ద్రౌ : నమస్కరించెదను. నన్నుఁ బోనిమ్ము!

కీచ : చెలీ! నాపై నీ కింతయైన కేల సానుగ్రహముగా లేదు? నా పూర్వజన్మకృతపాపఫల మెంతగా బాధించు చున్నది. ప్రియా! దయఁజూపుము, దయఁజూపుము.

(చేయి గ్రహించఁబోవును)

ద్రౌ : ఓయీ! ఎంతటి తెలివిమాలినవాఁడవు. దాసీసంగమము లాయుఃక్షైణ్యములు. అందులో నికృష్టదాసి నైన నన్నా నీవు వరించునది?

కీచ : మదవతీ! ఆయుఃక్షైణ్యమా! కానిమ్ము! నీ సంయోగములేని యాయువుమాత్ర మేమిటికి? స్వర్గభోగము లనుభవించనా? ఆనందధామము లెక్కనా?

నీవు గాఢపరిష్వంగ నియతిఁ గలుగు
నిమిష మేనియు బ్రతికితి నేని జాలు
నీ కిషము గల్గి కల్పముల్ చింపువఱకు
బ్రతికితిం యమ్మ! భస్మహవ్యంబ, యేల?
నీ సురోజాగ్రమున నుండు నిమిషలోన
మృత్యుకౌగిలినైన రానిమ్ము నాకు
భయము లేదె మృగాక్షి! యీ భవమువలనఁ
గలుగు లాభ మా భాగ్యమే కలిగియుంట.
నీ పరీరంభమునను నిందీవరాక్షి
తెలుగునే యమ్మ యాయువు, తఱగ నేని
మిగిలినదె యనుభూతమా మెలఁత! కాక
యిప్పటికె గతియుంటు కౌదటపే లతాంగి!

(సమీపించును)

ద్రౌ: (తొలఁగి) పరస్త్రీలపై నేల ప్రసరించుచున్నవి నీనృపులు? నీవేను బాహుబలతృణీకృతాఖిలమత్స్య దేశ శాత్రవుఁడవటె! ఇది నీకు యోగ్యము గాదు. పరస్త్రీసంగమంబునఁ గలుగుదోషమును నీవంటి దోషజ్ఞునకు నా చెప్పఁబని లేదు.

కీచ: ప్రేయసీ! కనంబడుచున్న దివ్యజ్యోతిస్సును జల్లార్పకుము. (చేయి గ్రహింపఁబోవును)

ద్రౌ: (తొలఁగి)

నావెంటన్ నిరతంబుఁ గాచికొని యున్నారేవు రస్మత్పతుల్
ద్యావాభ్యంతరగాము లెందయిన గంధర్వుల్ స్వకీయోగ్రబా
హావిద్యస్తపదుస్తశాత్రవసమూహానంతకీర్తిస్ఫురత్
శ్రీవిద్యోతితమూర్తులా కెలన నీ చేటింతయున్ దప్పదే!

కీచ: ఇదియా యింతవఱకు నీ యనుమానము? నీ కేమియు భయము లేదు. నా బలము నా చేతనే యేల పొగడించెదవు? రాజన్యులు సుష్టుగాఁబంపు మత్స్యదేశములే దానికి సాక్షులు.

ద్రౌ : దేవీ! చూచితివా యీ సేవకురాలి యవమానము!

సు : ఏమమ్మా?

ద్రౌ : నీ తోఁబుట్టువట. అతని పేరు నాకుఁ దెలియదు. వాఁ డెవ్వరు లేకుండ, నన్ను జెఱఁబట్ట వచ్చెను. దేవీ! యేమని చెప్పుదును! నా జన్మ మేమోకాని సురక్షితము లైన ప్రదేశములలోనే నాకుఁ బరాభవములు తటస్థించుచున్నవి. చెప్పితిని గదా తొలుత నీతో, నొకానొక కారణమువలన నాపతుల యెదుట నే నిండుసభలో నున్న పరాభవింపఁబడితినని. మఱల నిచటనో! భూమిజనులా, రాజకుమారులుగూడ రారాని యీ యంతఃపురమున నా స్థితి యిట్లైనదె?

సు : అయ్యో! ఎంతపని జరిగినది. తల్లీ! ఇది యెవ్వరితో ననకుము. నేను వానిని జీవాళ్లు పెట్టి పంపించెదను. ఇంక నీవున్నంతవఱకు నతఁ డిచటికి రాకుండఁ జేసెదను. నాకెంతటి యప్రతిష్ఠ వచ్చు పని చేసినాఁడు. నాచేతనైనంతవఱకు వాని బారి నీవు పడకుండఁ జేసెదను. చింతిల్లకుము.

ద్రౌ : కానిమ్ము! నీయండఁ జేరితినిగదా! దానివలన గలుగు ప్రతిష్ఠాప్రతిష్ఠలు నీవియే!

సు : అమ్మా! మన్నింపుము. నే నతని కన్నులఁ గప్పిపోవుటకే యిచటినుండి వెళ్ళితిని. నే నున్నచో నట్టిది తటస్థించెడిది కాదు! నీవిచ్చటి కెట్లు వచ్చితివి?

ద్రౌ : అతఁడు మొదట నన్నుఁ గలసికొని యేదియో ప్రసంగింపవచ్చినాఁడు. నేను మాటాడక యతని దప్పించుకొని నీతోఁ జెప్పవలె నని యిచ్చటికి వచ్చితిని. మీరు లేరు. అతఁ డిందుండెను.

సు : చెలియలా! ఇక్కట్టులలో నున్నవారికే క్రొత్త యిక్కట్టులు. నాతో వాడు నీ ప్రసంగమే తెచ్చినాడు. నే నతని యెదుట నున్నంతసేపు కల్లమాటలాడు ననియు నతఁడు వదలిపోయిన బాగుగనుండు ననియు, నే నిచటినుండి వెడలి పోతిని. నీతో నీవిషయము చెప్పి యతఁ డింకొన్నాళ్ళ సేపు నీవు వాని కనులకుఁ గన్పింపకుండ నుండుమని చెప్పుటకు వచ్చితిని. నీవు నాకుఁ గనరాలేదు. దురదృష్టవశమున నీ విచ్చటకే వచ్చితివి కావలె. తల్లీ! నీకడుపు పుచ్చుకొని బ్రతిమాలెదను. సుదేష్ణ యంతఃపురమున నిట్లు జరిగె నని చెప్పకు మమ్మా యెచ్చటను! నేను నీ కింక యెద్దడి లేకుండఁ జేసెదను. అట్లు చేయ నని నా చేతిలో చేయి వేయుము.

ద్రౌ : అన్నవస్త్రములిచ్చి పోషించితి విన్నాళ్ళు. నేఁ డేదియో నాదురదృష్టమున నిట్లు ఘటిల్లినది. నీ వేమిచేసెదవు తల్లీ! నిన్ను నే నెఱుఁగనా! నీపై నేదేని యని నే నే మన్ని బ్రదుకగలను.

సు : నీ వింక పదవల్లకీ! సింహబలుఁ డెం దున్నాఁడో?

(తెరపడును)

# ద్వితీయాంకము

ప్రవేశము — కీచకుఁడు. ఉద్యానములో

కీచ :

ఈ విరహవహ్ని నన్ను దహించుచుండియుఁ
గాల్చి బూదిఁ జేయదు కాయ మింత
యా లతాంగి దయావ్యాపృతాక్షియుగము
ప్రాణములతోడ లే దేమొ ప్రాప్తి నాకు?

ఆ మనోహారిణి కపోలస్పర్శ గావించితినో, యా జగన్మోహిని మధురామృతరసాస్వాదన మొనరించితినో, గాఢ మగు నాలతాంగిని పరిష్వంగ మనుభవించితినో, చివర కా పద్దరాలి కరాంభోరుహము నంటితినో యచ్చిన, నా మనస్సున కింత వేదన యుండెడిది కాదు.

ఏ ప్రశీతలవాఃకణ శ్రీప్రకాశ
మైన నిముసంబునందు నా యంగ మంటి
ప్రకటవిగ్రహకంపమస్పృశశీత
మైన నీ మేను స్పర్శసౌఖ్యం బొసఁగునో ?

యని చింతించితిని. ఆమె రసికురాలయిన నా మాటలలోని రహస్యము దెలిసికొనదా? అప్పుడు నా భావోన్మాద మా జవరాలికి బోధపడదా ?

ఊరక నాకుఁ బిచ్చియాలోచనలే కాని, యామె యప్పటిస్థితిఁ జూచిన నా మనోరథము కొనసాగునట్లు లేదు. నే నామెను స్పృశింపఁబోయినప్పు డా పొలంతుక స్త్రీసహజమైన సిగ్గుచేతఁ గంపించినట్లు లేదు. నిజముగా తన పాతివ్రత్యము పాడై పోవునేమో యని భయపడినట్లున్నది కాని—

నా యప్పటిమాటలు లామె కసలు వినంబడెనో లేదో! అక్కటా! నా దౌర్భాగ్య మే మని చెప్పుదును!

స: చిత్తము.

కీచ: నల్లకీ! ని న్నొక టడిగెదను.

స: మహాప్రసాదము.

కీచ: ఆమె పే రేమి?

స: సైరంధ్రి యని వారు అసలు మార్చిరి.

కీచ: మా యక్కగారి యంతఃపురమున నెన్నినాళ్ళు గా నివసించుచున్నది?

స: సంవత్సరము కావచ్చుచున్నది.

కీచ: ఆమె వృత్తాంత మంతకన్న నేమియు తెలియదా?

స: ఆమె కైదుగురు పతు లున్నారంట. వారు గంధర్వులు.

కీచ: (ఊరకుండును)

స: ఏ మాలోచించుచున్నారు?

కీచ: నీకు నామెకు నేమియు చెలిమి లేదా?

స: ఎక్కువ లేదు.

కీచ: ఆమె లోచనములలో తొణకుచున్నది. అయినను గురు భర్తలకు భాగ్యయా! ఎంత కామునకి!

స: మీ రనునది నాకు దెలియుట లేదు.

కీచ: ఆమె కనులలో చిత్ర మున్నది. ఆ కన్నులు నీ కెట్లు కనబడును.

స: నే నెప్పుడు నాలోచించలేదు.

కీచ: ఏమో కష్టము లనుభవించిన జీవికన్నులవలె నుండవా?

స: ఆ! అట్లే యుండును.

కీచ: అవి యంతియుకాదు. కామో! దేనినిగూడ సూచించుచున్నవి. ఆయమనుగుఱించి నీకేమైన ననుమానము లున్నవా?

వ: ఆమె దేవరవారి కంత యలభ్య కాదు.

కీచ: ఏమో చెప్పవు.

వ: ఆమె రాత్రులం దప్పుడప్పు డెచటికో పోవుచునే యుండును.

కీచ: పతులు గంధర్వులంటివే! వారును నీమెయును నేర్పఱచుకొన్న సంకేతస్థాన కేమో!

వ: అయిన!

కీచ: అప్పు డామె శీలమును మన మెట్లు శంకింపఁగలుగుదుము.

వ: కాని పతులతో నగ్రాత్రముల నిశాకాలములందుఁగాక స్వైరసంచారము సేయుచు మాని యున్నదా?

కీచ: అదికాదు! ఆమె సవర్తన యెట్టిదో తెలియుటలేదు.

వ: నిజమైనమాట కిటువంటి స్త్రీకి గంధర్వు లెందరు భర్తలు కాఁగలుగుదురు.

కీచ: ఎందుచేత ?

వ: ఈ మాత్రము సౌందర్యమునకా!

కీచ: ఈ మాత్రము సౌందర్యమునకా! పిల్లా! స్త్రీల సౌందర్యము స్త్రీలకుఁ దెలియదు.

వ: అయినను గంధర్వులు మనుష్యుల కెట్లు పతులు కాఁగలుగుదురు ?

సు: అయ్యో! ఇదియేమి! దీనికి గారణము?

ప: ఎట్లు తెలియఁగలగు.

సు: వైద్యుని బిలుచుకొని గ్రమ్మఱ నీవు పొమ్ము.

కీచ: (లేచి) ఏమన్నావ్ 'అంతఃగ్దయ' ఎవరా వైద్యుఁడు? మీ రనుకొనుచున్న మాటలు నేను వినుచునే యున్నాను. ఓపిక లేక మాటాడలేను. నా యీవ్యాధికిఁ జికిత్స చేయించ నాయిదవేళ యావెజ్జు నెవనో పిలుచుకొని వచ్చు టేల?

సు: ఇంక నెవరో ధోరణియా? పరకాంతలపై నింత మరులుగల నీవు బాగుపడవు. సైరంధ్రి నేమని యనుకొంటివి? మత్స్యదేశాధీశుని యంతఃపురపరిచారిక. ఆమెమీఁద నీకగ్రవాలినచో విరాటనృపతికిఁ దలఁపరాని తలవంపు. మత్స్యదేశునకు నీ వండ యనుమాట నిజమే. నీ యండ దేనికి మాకు! ధర్మము నడుపుటకు; న్యాయ్యము దీర్చుటకు. రాజులు గలరు. రాజాంతఃపురములు గలవు. ఇట్టి యపభ్రంశపు పను లెందును జరుగవు. నా గొంతులోఁ బ్రాణ ముండునంతకు నీ కా స్త్రీ లభింపదు. నీయంత బాహుబలశాలులు కాకపోవచ్చును గాని నాభర్తయుఁ బుత్రుఁడును నంత తేజోదరిద్రులుగారు. నీకు నిజముగా నా లతాంగిమీఁదనే యభిప్రాయముండెనా మొట్టమొదట మత్స్యదేశమును భిన్నము చేసి మాయందఱ కుత్తుకలు గోసి యనంతర మామెను హరించుకొని పొమ్ము. (నిష్క్ర)

కీచ: హా! హా! ఇవి యేటి మాటలు. అక్కా, నన్ను రక్షింపు మని కాళ్ళఁబడితినిగాని యధికారము జూపించితినా? ఆమె కంతతొందర యెందులకు! ఈమన్మథానల మోర్చుకొన లేక నే నుండగాఁ ద న్నే మంటిని?

విరాటనృపతి నా వలననే బ్రతుకుచున్నాఁడా? నేనే యతని రక్షించుచుంటి నని మఱచితివా?

ఈమహాంభోధిఁ దరియించు టెట్లు? అబ్బా! కోమలాంగుల నాటి మాటలు! ఆమె సందాక విడిచిపెట్టినను ... తెరయుంతే పురుషసింగమని గదా! నిజముగా రాజ్యమంతయు నా భుజబలము మీఁదనే యాధారపడి యున్నను నేను వారికి సేవకుఁడనయియే యుందును గాని రాజసభాపోకడలు పోను.

అక్కా! ఇంతమాత్రము తెలిసికొనలేకపోతివి. సింహబలుఁడు నేఁడో రేపో యీమన్మథానలముచేఁ బడి నశించిపోయి నప్పుడు శత్రువులు మత్స్యదేశము నాల్గు వైపులను చుట్టుముట్టినప్పుడు, నామాట నీకు జ్ఞాపకము రాఁగలదు. అప్పుడను కొందువు, 'అయ్యో! అంత వీరయువకుడైన తమ్ముని చేతులారఁ జంపుకొంటిమే' యని. అప్పుడు మీ కెవరు సాయము చేరుదు? సైరంధ్రిపతులైన గంధర్వులు వచ్చి సాయపడుదురు గావలయు.

వ: స్వామీ! నిరాశఁ జెందకుఁడు.

కీచ: మొట్టమొదట నీమాలిని వచ్చి కొలువునఁ బ్రవేశించినప్పుడు నీ వున్నావా?

వ: చిత్తము.

కీచ: అప్పుడీమె యేమని చెప్పి ప్రవేశించినది? ఆనాటి మాటలు జ్ఞాపకము చేసికొని యొక్కొక్కటే నెమ్మదిగ నన్నియుఁ జెప్పుము.

వ: తనపేరు మాలిని యనియుఁ దాను కూడు బట్ట యిచ్చిన సేవఁ జేసెద ననియుఁ నీచవృత్తిఁ జేయ ననియు తా

వ : స్వామీ! అదికాదు. నిజముగా నా మెభర్తలవద్దకే పోయెదనేని యామె మొట్టమొదట నే నడిగినప్పుడే మొగము తెలవేయవలసిన యవసరమే లేదు. ఇది తరువాత కుర్కట్లు త్రిప్పుకొని యున్నమాట.

కీచ : సరి, దానికేమి! నీ విప్పు డీకార్య మెటుల సాధించఁగలవు.

వ : ఆమెను మీ యింటికి బంపించెదను.

కీచ : (ఆశ్చర్యముతో) ఆ యెట్లు సాధ్యము?

వ : సుదేష్ణాదేవికి నాయందున్న మిక్కిలి యిష్టము తమ యింట దొరకునంత మంచిమదిర భూమండలమునందును లేదుగద. కావున మీ యింటనుండి మదిరఁ దెచ్చెదనని నేన చెప్పెదను. తరువాత నే నేదో పనిమీద నున్నట్లు నటించి సైరంధ్రి నీపనిమీదఁ బంపించెదను.

కీచ : ఆమె రాదేమో!

వ : అయ్యా! ఇది సేవావృత్తి. దారిలోఁ ద్రాచుపాము కాపువేసికొని కూర్చున్నదని తెలిసినను వెళ్ళితీరవలెను!

కీచ : వల్లకీ! అంతమోస మెందులకు?

వ : దేవరవారి చిత్తము.

కీచ : ఆహా! ఇదేమి?

ఒక్క యొడ నిది న్యాయ్యము కా
దు కాదనియె యంతరాత్మ దూషించెను త
ప్పక చేయుచున్నానసువులు
పెకలించెడినో మరుండు పీతనయుండై

వల్లకీ! నీ యీమోసము సుదేష్ణాదేవికిఁ దెలిసినచో!

వ : ఆమె మీ మీఁద నిప్పుడు కోపగించి పోయినదా? ఇదే యామె నీ రాత్రియెల్ల వేధించును. ఆమెకు నిద్దుర పట్టదు. "అయ్యో! సింహబలుఁ డెందుకంటి" యని తహతహ పడుచుండును. అప్పుడు కొంచెము మద్యము ద్రాగి నిదురించిన శాంతిగా నుండు నని చెప్పి మత్తుపదార్థము గలిపి యామెకుఁ ద్రాగించెదను.

కీచ : సైరంధ్రి నీమాటలమీఁద రాక సుదేష్ణాదేవి యాజ్ఞఁ బుచ్చుకొని గాని రా ననుచేమొ.

వ : ఆ మత్తులో దేవి ప్రతిదానికి ఊఁ, ఊఁ, యని యంగీకారమే.

కీచ : తరువాత నిది యామెకుఁ దెలిసిన!

వ : ఒక్కసారి సైరంధ్రి తమ యింటికి వచ్చిన తరువాత నావిషయమునుగూర్చి యామెతోఁ జెప్పునది యెవరు? సైరంధ్రి యేమనఁగల దీమాట? తానున్న సిరికి మోకా లడ్డు పెట్టుటకు. ఆయింటి రాజభోగముఁ జూచి యామె మఱల నీ యాతఃపురమునకు వచ్చునా?

కీచ : నల్లకీ! మఱి సైరంధ్రి యెప్పుడు వచ్చును?

వ : ఈరాత్రి వచ్చునో చూడు! తెల్లవారు వఱకుఁ దమ గడప దగ్గ రామె యుండఁగలదు.

కీచ : ఇది నిజమేనా!

వ : సంశయము లేదు. సెలవు.

(నిష్క్రమించును) (తెర)

# తృతీయాంకము

## ప్రవేశము—సుదేష్ణ

సుదేష్ణ: నే నన్నిమాట లనినను జవాబుకూడ జెప్ప లేదు. నాయందెంతవినయముండు. అట్టివాని నూరక పట్టుకొని యెన్నిమాటలు, ఎట్టెట్టిమాట లంటిని. ఇతడేమి ధూర్తుడుగా బ్రవర్తించెనా?

అతని భుజాబలమున మత్స్యదేశములు శత్రుభీకరముగా నున్నవి. మత్స్యదేశములు ధర్మభూయిష్ఠములన్నచో నదియును భుజోపార్జిత పౌరుషమువలన. అతడన్న నా మనోనాథునకు నెంత గౌరవము! అతని నంతగా నుపాలంభించుట తప్పే.

అయినను నంతమాత్రమున నలిగినదే. అతడు నామాట లెక్కసేయడా? చేయడా? మాలినివిషయమున న దుష్టముగా బ్రవర్తించవలె. అది యెన్నటికిని జరుగనేరదు. జరిగినచో నిక నాది యంతఃపురమేమిటి? ఇతడేమిటి? ఉత్తరుడైన నిట్టి పని జేసిన నిందార్హుడు. శిక్షార్హుడు.

ఎంతగా నిశ్చయించుకొనినను నతని నిట్లు పలికిన తరువాత నా మన స్సంత శాంతముగా లేదు.

వల్లకి ప్రవేశించును.

సు: వల్లకీ! మాసింహబలుడేమైనాడు?

వ: వారియింటికి వెళ్ళినారు.

సు: నే నట్లనగా నే మన్నాడు?

వ: పాపము, కళ్ళనీళ్ళు పెట్టుకొన్నారు.

సు: అయ్యో!

వ: మీ రప్పు డెటువంటిమాట లన్నారు. వారు చాల మంచివారు గనుక నే యూరకొన్నా రని నాయుద్దేశ్యము.

సు: ఊరకొనక యేమిచేయు నందువు?

వ: దేవిగారిని వారేమి చేయఁగలుగుదురు? వారికిఁ గోపము వచ్చెడిదే యింకొక రైనచో.

సు: అవును. అతనికిఁ గోపము రాలేదు.

వ: మీరు వచ్చినతరువాత "వల్లకీ! మా యక్కగారు మాచిత్రిచా నన్నిట్టిమాటలన్నదో! ఛీ! యింక నా బ్రతుకెందుకు! ఆమెచేత నిట్టిమాటలు పడి నే నీ యంతఃపురమున నుండుటకన్న సిగ్గుమాలినపని లే" దని వెళ్ళిపోయినారు.

సు: ఇంక నిక్కడకు రాఁడా యేమి?

వ: ఏమో!

సు: అతఁ డీ పాటి కెంతదూరము వెళ్ళి యుండును?

వ: రథ మెక్కి వెళ్ళిన రాయన యెంత దూరమైన వెళ్ళును.

సు: వల్లకీ! నిజముగ సింహాచలునకుఁ గోపము వచ్చినదా?

వ: కోపము నాకుఁ దెలియదుగాని దుఃఖము వచ్చినది.

సు: అది సరియేకాని పాప మా పతివ్రతజాలి తన కెందుకు?

వ: అమ్మా? ఎవ్వరి సంగతు లెట్టివో! అందఱకు నెట్లు తెలియును.

సు: నాకీ నాఁడు తలనొప్పిగా నున్నది.

వ: అది తలనొప్పి కాదు.

సు: మఱి యేమి?

వ: కీచకమహారాజుగారి కన్యాయ్యమునగ సల్లాపమే యని తమ మనస్సులో నున్న యాందోళన.

సు: కావచ్చును.

వ: కొంచెము విశ్రమింపుడు.

సు: (పండుకొనును.)

వ: అమ్మా! ఇప్పు డెట్లున్నది?

సు: వల్లకీ! సైరంధ్రిని బిలువుము.

(వల్లకి నిష్క్రమించును.)

సు: సైరంధ్రి గొంతుక యెంత మంచిది! కంచుగీచి నట్లుండను. సంగీతము విన్నచో నా తలనొప్పి తగ్గు నేమో! సైరంధ్రి యెవ్వరో! ఆమె రాజాంతఃపురముల సేవఁ జేయుటకుఁ దగనిది. ఆమె కేమైన పని జెప్పవలె నన్న నాకుఁ దల కొట్టుకొన్నట్లుండును.

వ: (ప్రవేశించును.)

సు: సైరంధ్రి యేది?

వ: వచ్చుచున్నది.

సు: (స్వ) ఆమె పట్టమహిషి యగుటకు యోగ్య. నడచుచున్నప్పుడు కలహంసవలె నుండును. తొందరగా నడువనే లేదు.

సైరంధ్రి: (ప్రవేశించి) దేవిగారు నన్నుఁ బిలువనంపిరి.

సు: అమ్మా!

సై: ఈసంబోధనమే నీయాభిజాత్యముఁ జెప్పుచున్నది.

సు: నాకుఁ దలనొప్పిగా నున్నది.

సై: ఏమైన శ్రమ గలిగిన దేమొ.

సు: ఏమియు శ్రమ లేదు.

సై: గాలి యంతబాగుగ లేదు చలిగాలి వీచుచున్నది.

సు: మబ్బులు బాగుగాఁ బట్టినట్లున్నవే.

సై: కొంచెము సన్నని తుప్పర పడుచున్నది.

సు: వల్లకీ! నీవు దుప్పటి తీసికొనిరమ్ము (వల్లకి నిష్క్రమణ.)

సై: ఎందుచేత వచ్చినట్లు తలనొప్పి?

సు: వల్లకి దుప్పటిఁ దెచ్చినదా?

వ: (ప్రవేశించి) ఇదిగో! కప్పుకొనుఁడు.

(సుదేష్ణ కప్పుకొనును)

సై: (స్వ) బంగరుజరీయంచు గల నీసేలువ కప్పుకొన నీమె సూర్యకిరణములు వ్యాపించి తళతళలాడు తెల్ల మొగిలుచేఁ ప్రకాశించు సంధ్యావతివోలె నున్నది!

సు: (వల్లకితో) నీవు వెళ్లుము. (వల్లకి వెడలిపోవును.)

సై: మొగమునిండఁ గప్పుకొనుఁడు.

సు: ఊపిరాడదు. నా తలనొప్పి యుపశమించుటకేదైనఁ బాట వినిపించుము.

సై: వర్షర్తువును గూర్చి పాడుదునా?

సు: పాడుము.

సైరంధ్రి:

స్ఫారీభవత్కేకిశిఖారాయితోత్తాల కాదంబినీస్నిగ్ధకాంతి యగుచు
మసృణకేశనిబద్ధకుసుమమాలాయితసౌదామనీప్రభాజాల యగుచు
అతినిరంతరపతత్ ద్రుతవర్షబిందు సంపూర్ణంబున రసార్ద్రమూర్తి యగుచు
శ్రీబలాకావధూటీబద్ధమాలికోద్యన్ముక్తమౌక్తికహార యగుచు

పతి పరిష్వంగమున కయి బడలి యుండి
క్రొత్తగా వేషమును గూర్చుకొన్న వధువు
వలె వినూత్న భావములందుఁ దొలుకలాడు
వారిబిందుల కన్నీట వర్షిబుతున్న.

సు: తలనొప్పి కొంచెము తగ్గినట్లుగా నున్నది. ఇం కొకగీతమును పాడుము.

కడిమి పూచినదో లేక చిగిర్చినదో యంచుఁ దొంగి చూచినది విద్యుల్లతాంగి
యెదురుగా నరుదెంచు భృంగముల్కు నకు స్వాగతమ్ము పాడినది మందారవనము
పతిసంగమార్ధమ్ము పరువులెత్తినది శైలాగ్రనిస్సృత నిర్ఝరాబ్జనేత్రి
సిగ్గుచెందినది పచ్చికబయలు శ్రీలు పేరి పులక లంటినయట్టి పుడమిపడంతి

నవజలదమాల సేయు గానంబులకును
నవమయూరాంగనలు సల్పు నాట్యములకు
భరతశాస్త్ర దేశికవరాళి పాతకాల
వోలెఁ జూడ ముచ్చటయయ్యెఁ బో వనంబు.

ప్రథమవర్ష బిందువుల పైఁ బట్టువడిన
ప్రకృతి రేవిధమ్ములఁ మఱల్చుకొన లేక
యీ బలాక లాకాశపు టెల్లలందు
వందు నాబద్ధనిశ్రేణులై మెలంగు.

శ్రావణముచేత నిల్లె యాషాఢమాస
బహుళపక్షమ్ము హరియింపఁబడియె నేమొ?
యెంతదళమయి క్రమ్మెన నీ జలదము
లమృతనిష్యందములు హృదయాంచలములు

నవవయఃప్రౌఢలైనట్టి నాతుకలు వ
సించు నీ సౌధపుగవాక్షసీమలందు
నీ జలదశకలరమణీయములను
బహుళమనోజ్ఞము లగురుధూపములు గ్రమ్మె

ఏమీ! ఆమె నిద్రపోయినదా యేమి? నే నింకెందుకుఁ జీ పోయెదను.

సు : (అర్ధనిద్రలో) నల్లకీ! కీచకుని బిలుచుకొని రమ్ము.

సై : (బెదరి. తనలో) ఇదేమేమి? అతని పేరిప్పు డెందులకు? (ప్ర) అతఁ డిప్పు డెందుకు?

సు : (అర్ధనిద్రలో) అతని నే నరానిమాట లంటిని. సైరంధ్రి మాటలు సహింపను.

సై : సైరంధ్రి యబద్ధము చెప్పిన దంగరా?

సు : (అ-ని-) ఆమె యట్టిది కాదు.

సై : (స్వ) ఈమె బెదరుచున్నది. పాపము; ఈరాజ్యము వాని భుజబలముమీఁదనే యాధారపడియున్న దఁట. అతఁడు పోయిన నేమి? సుదేష్ణా! నీకు వచ్చిన భయము లేదు. సంవత్సరము నీరాజ్యమునఁ దలదాఁచుకొన్న కృతజ్ఞత మీ రాజ్యరక్షణార్థము పాండవసింహములచేత నేమి చేయించలేదు? (ప్రకాశముగ) దేవి! నిదురపొమ్ము. ఇంకొకగీతము పాడెదను. అప్పుడే చీఁకట్లు గ్రమ్మినవి.

ఈ శిశిర యామువులు సన్నయీల వేయు
నల్లనల్లన తరుశాఖలందుఁ జేరి
ప్రణయినీనవ్యసంకేతబద్ధులను
నెన్నిదినములుగా నేర్చుకొన్న వగలునో.

ఇంటిచూరుల నుండి స్రవించు నీటి
బొట్టు లొకరీతిగాఁ బడి భూమిమీద
సరి యగునెడము గలిగి నిస్వనము సేయఁ
బడమిషైఁ జన్నుగుంట లేర్పడెడు నట్లు.

అరవిరిసినట్టి కలువలయందు జేరి
మాటసికొనుచున్నయవి నీటిగొట్లు వరుస
నాచుకొని నీటిమూలలయందుఁ జేరి
మెల్లముడుచుః కూర్చున్న పిల్లలట్లు.

ఈమెకు నిద్రపట్టినది. నేను బోయెదను. (నిష్క్ర)

వ: (ప్రవేశించి) సైరంధ్రిపోయి యొంగా నేపైనది. మత్తుపదార్థములఁ గలిపి మద్యము సిద్ధము చేసితిని.

సు: (అర్ధనిద్రలో) వల్లకీ! నీవు కీచకుని యింటికి బొమ్ము

వ: మద్యము తెమ్మంటారా?

సు: (అర్ధనిద్రలో) మంచి మద్యము దీసికొనిరా!

వ: తీసికొని వచ్చితిని. పుచ్చుకొనుఁడు.

సు: నాకుఁ గన్నులు తెరపు కనబడుట లేదు. నీవు నన్ను నెమ్మదిగఁ గూర్చుండఁబెట్టి యిమ్ము.

వ: (అట్లు చేయును)

వ: ఎట్లున్నది? ఇది మీతమ్ములు కీచకమహారాజుగారి కొఱకుఁ జేయఁబడినది.

సు: (పండుకొనును)

వ: ఇంకఁ గొంచెము తెప్పించరా?

సు: ఊఁ_

వ: సైరంధ్రి వెళ్ళితీసికొని వచ్చెద ననుచున్నది.

సు: ఊహూ.

: ఆమెయే వెళ్ళెద నన్నది.

సు: ఊఁ

వ: సైరంధ్రి యిప్పు డేమి చేయఁగలదు? నేను ముంగు వసారాలో నిలఁబడెదను. సైరంధ్రితో నెమ్మదిగా మాట్లాడ

వచ్చును. నేను రాకముందే యీమెకు నిద్రపట్టినది. సింహబలునితో సైరంధ్రిని నేనడుగనిదే యడిగితినని చెప్పితిని. కాని మిమ్మిప్పు డడిగెదను వచ్చుచున్నది

సై: (ప్రవేశించి లోపలికిఁ బోఁబోవును)

వ: దేవిగారు నిద్రపోవుచున్నది. ఎవరిని లోనికి రానీయ వద్దన్నది.

సై: సరే (తిరిగి పోఁబోవును)

వ: మాటమ్మా! ఏమంత తొందర! ఇప్పు డెంత ప్రొద్దుపోయినది.

సై: ఒకజాము ప్రొద్దుపోయి యుండవచ్చును.

వ: ఇప్పుడు నీవు నడచి యొంటరిగా నెక్కడికైనఁ బోఁగలుగుదువా?

సై: ఎందుకుఁ బోవలయును?

వ: కాదు, వెళ్ళవలసివచ్చినచో వెళ్ళఁగలవా?

సై: నీవన్న మాటలు నా కర్థముగాలేదు.

వ: అదికాదమ్మా! నీకు భయము లేదా యని.

సై: నీకు భయము లేదా?

వ: నాకు భయము గనుక నే నీవు వెళ్ళఁగలుగుదువా యని యడిగితిని.

సై: నాకును భయమే.

వ: అవసరమైన పనియున్నచో?

సై: తప్పనిసరికిఁ బోవుదుముగాని భయపెట్టును భయమే

వ: నీకు భయములేదు. నీవు రాత్రులం దెచ్చటకైనఁ బోఁగలుగుదువు.

సై : ఈ చమత్కారము బాగున్నది.

వ : ఏమందువమ్మా కోపమా? నీకు భయము లేదని నాకుఁ దెలియునుగాన నే చెప్పితిని

సై : నీ కెట్లు తెలియును?

వ : అప్పుడప్పుడు నీవు రాత్రులయందు నొంటరిగా మే మందఱము నిద్రపోగాఁ జూచి పోవుచుందువుగా !

సై : అవును. పోవుచుందును.

వ : అందుకనియే భయము లేదన్నాను.

సై : ఊఁ. భయము లేదు.

వ : ఇటువంటి రాత్రులయందుఁ గూడ భయములేదా?

సై : ఏమో యది నీ కెందుకు?

వ : మన కేమి మాటలు లేవా? విరోధమా మనకు? అట్లు మాటలాడెద వేమమ్మా?

సై : చెప్పఁదలఁచిన దేదో చెప్పుము. అనవసరప్రసంగ మెందుకు?

వ : నిన్నొకమాట యడిగెద ననుకొన్నాను. నీవు కోపపడినచో నెందుకు?

సై : అవును, ఎందుకు?

వ : నాకు నడుగవలయు ననియే యున్నది.

సై : అడిగిన నడుగుము. లేదా లేదు.

వ : నీ వట్లు పోవుచున్న దెక్కడకు?

సై : నా భర్తలు గంధర్వులైదుగు రుంటిరింటినే, బాహుబలతృణీకృతనిఖిలశాత్రవవీరులు! వారియొద్దకు.

వ : అబద్ధము.

సై : నోరుమూయుము.

వ : ఓయమ్మ! మిగులుమాట లెందుకు? నీవిప్పుడు తక్షణముఁ గీచకమహారాజుగారి యింటికిఁ బోయి సుదేష్ణాదేవికి మద్యముఁ దీసికొనిరానలయును. ఆమెకు మిక్కిలి దలనొప్పిగా నున్నది. తన్ను నెవరును మాట లాడించరా దన్నది. ఆయన గారింటివద్ద మంచిమద్యము దొరుకును. ఆయన ప్రత్యేకముగఁ దనయక్కగారి కని మదిర నిలువఁజేసి యుంచును. అది త్రావిన గాని యామెకు శిరోభారము శమింపదు.

సై : అతని యింటికి నేను బోను.

వ : ఇది పనికత్తె యనవలసిన మాటయేనా?

సై : ఇంత చీఁకటిలో నెట్లు?

వ : ఏమో! ఎట్లో!

సై : నిజముగా నన్ను దేవి యచ్చటకు వెళ్లుమన్నదా?

వ : వెళ్లు మనలేదు. నేనే చెప్పితిని.

సై : వెళ్లుమన్నచో వెళ్ళెదను. ఆమెను గనుగొని మఱి పోయెదను.

వ : ఆయమ నిద్దుర లేపన ద్దన్నది.

సై : నీమాట నేను నమ్మను.

వ : నమ్మక పోయినచో నిక్కడ నూరకే కూర్చుండి సుదేష్ణాదేవిగారికందాలోఁ బడి తినుచుండుము. వారిపనులకు మాత్రి మక్కఱకు రాకుము. నా సొమ్మేమి పోవుసది. ఆమె నీతోఁ జెప్పుమన్నది. నేను నీతోఁ జెప్పితిని. నీవు చేయుము. చేయక పొమ్ము. ఆమెచేత నీవు పనిచేయించు కొందువో

యామె కే నీవు పనులు చేసెదవో యది మీకుఁ దెలియవలెను. నా కేమి తెలియును? (నిష్క్రమించును.)

సై: ఇది యేమో పన్నాగము పన్నినారు. నే నిరాత్రి కీచకునియింటికా? ఈయర్ధరాత్రమునను? ఏపిడుగైనఁ బడినచో నేమియగుదును. హాయి! నా భర్తలు బ్రతికిపోదురు. స్త్రీచిత్తము పురుషుని భాగ్య మన్నారు. నాభర్త లిట్టి మహాపద లనుభవించుట నామూలముననేగదా!

నే డింతకథ జరిగినతరువాత నన్ను వానియింటికిఁ బంపునా సుదేష్ణ? ఆమె యట్టిది కాదే! నల్లకి యేవైన దుష్టపు మాటలు చెప్పి యొప్పించెనా? నల్లకి యీకోపము జూచిన సుదేష్ణ చెప్పినట్లే యున్నది.

ఎఱిఁగి యెఱిఁగి పులియున్న పొదలోని కేల్లుపోగుదు? ఆహా! సేవావృత్తి యెంతచెడ్డది. నే నిప్పుడు పోకపోతినా నా భర్తల ధర్మమార్గసంచారిత్వమునకు నామూలమునఁ గళంకము రాఁగలదు. మాటనిలుపుటకై సకలరాజ్యమును దృణముగాఁ బరిత్యజించిన యుధిష్ఠిరచక్రవర్తి ధర్మపత్నినై నే నిట్టి యధర్మ మే మని చేయుదు? మరణ మైనను రానిమ్ము యజమానురాలి యాజ్ఞ చేసితీరవలయును.

ఈ యర్ధరాత్రమున నచ్చటి కెట్లుపోదును? పోదునుపో! దారిలో నాకేమి? నా యీ ప్రాణము పిడుగుపడినను బోదు. ఇం కెన్నికడగండ్లు పడవలసి యున్నవో!

తీరా, యచ్చటికిఁబోయినతరువాతఁ గీచకుఁడు పునః యట్లే ప్రవర్తించినఁ జేయవలసిన దేమి? నే నీయర్ధరాత్రమున నెంత

యాక్రోశించిన నెవ రడ్డుపడెదరు? ఎట్టులైన జే ఫుదయమున
సైనచో నేమో, భారమంతయు సర్వేశ్వరునిపై వైచి పోయెదను.
వల్లకి యబద్ధము చెప్పినదేమొ. సుదేష్ణనే కనుగొనెదను.

సు : వల్లకీ !

సై : ఎందుకమ్మా !

సు : సైరంధ్రి కీచకుని యింటికి వెళ్ళినదా?

సై : (స్వ) ఇప్పటి కనుమాననివృత్తి యైనది.

సు : దాహము.

సై : తెల్లవారక ముందే పోవలయునా?

సు : ఊఁ.

సై : ఈ గాఢాంధకారమునఁ బోవు టెట్లు ?

సు : అయ్యో! దాహము.

సై : తెల్లవారిన తరువాతఁ బోయెదను.

సు : ఊఁ

సై : తెల్లవారువరకుఁ గీచకుని యింటివద్ద నుండవల
యును. ఇప్పు డెంత ప్రొద్దుపోయినది! అదిగో హజారమున
గడియలు కొట్టుచున్నారు. రెండుజాములు దాటినవి. కాఱు
చీఁకట్లు గ్రమ్మినవి.

(వల్లకి ప్రవేశించును) 

సై : వల్లకీ !

వ : నాతో నీ కేమిపని ?

సై : మాటినీవేకదా నన్నుఁ గీచకునియింటికిబొమ్మన్నది

వ : వెళ్ళెదవా ?

సై : వెళ్ళ నక్కఱలేదా ?

వ: వెళ్ళెదవా? అని చెప్పినను.

సై: ఊ

వ: సరే వెళ్ళుము.

సై: మదిరకుం బాత్రకావలయును. ఆయనయే యిచ్చెదరా?

వ: ఇక్కడనుండియే తీసికొనివెళ్ళవలయును.

సై: నీవు తెచ్చిపెట్టుము.

వ: మంజీరకున నీవే యడుగుము. కొట్టులోనుండి తెచ్చియిచ్చును.

సై: నే నెప్పు డిదివఱ కతనితో మాట్లాడలేదు.

వ: ఇప్పుడు క్రొత్తగా మాట్లాడుము.

సై: పరపురుషులతో నేను మాట్లాడను.

వ: నేను?

సై: నేను వ్రతమున నుంటినిగదా!

వ: మఱి కీచకమహారాజుగారితో నెట్లు మాట్లాడెదవు?

సై: (మౌనము)

వ: నా కెందుకు! ఇదిగో సువర్ణపాత్ర. ఇందాకనే తెచ్చితిని.

సై: తెల్లవారనిమ్ము.

వ: దేవిగారికిం దలనొప్పి యప్పటి కెక్కువ కాదా! నీ యిష్టము. (నిష్క్రమణ)

సై: సుదేష్ణ నన్నీ పనికి నియమించినదేమి! ఏమో! ఈమె పయోముఖవిషకుంభ మేమో! ఏమి కానున్నదో!

(తెరపడును)

# చతుర్థాంకము

నిశాభాగము. ప్రవేశము. కీచకుఁడు

కీచకుఁడు: అహో కాముకినో.

అరమూఁతల కన్నులు నుం
దరవక్రాపాంగములు వృథాసంచలను
దురచేలాంచలములు నా
తరుణి హృదయభావములను దాచక చెప్పున్

నాలో నుద్భవించిన యీ మహాగ్ని చాలదా! ఎందులకీ గాలి యింత నిప్పులు చెఱుగుచున్నది? ప్రియా! నీమూలమున నాకీ స్వర్గాసమాయాశాస్వాదియంచుఁ గప్పుకొనుటకు దుష్పటికాండ సహింపజాలేక పోవుచున్నది.

ఈ మేఘము లింత గర్జిల్లుచున్నవి. ఇవి సింహములా యేమి? శబరకన్యకల చేత నాస్మృతమైన నవమృగ్మవోలె నల్లని యీ యాకాశమీ జీమూతములచేత నెంత యొప్పుచున్నది! అదిగో మెఱయుచున్నది.

ఓ జలదకన్యకా! యెంత మెలుకుచున్న
నీ జఘనభాగమున రమణీయమైన
లలితసౌదామనీమేఖలానిబద్ధ
దృష్టి నగు నన్నుఁ గికురించె దేల యిట్లు?
శ్యామలమనోజ్ఞమైన నీ చక్కఁదనము
తలఁచుకొన్నకొలంది యీ పులక లెత్తు,
మోహనాంగి వింత రసార్ద్రమూర్తి వచల
కఠినతామంగ్గముల నేల కొలువెట్ట?

మిత్రుఁడు శారద్వతుఁడు రాలేదు. నాకీ బాధయేమో యపనయింపరానిదిగా నున్నది. వానలో రాలేక యూరకున్నాఁడేమొ? మామైత్రి యట్టిది కాదే. పిడుగులుపడుచున్నను

రాపలసినదే. ఎవరు? శారద్వతా! (పోయి చూచి) ఈయీవాగు గాలికిఁ దలుపు ద్రోసికొని వచ్చినది. ఈయంధకారము నీవర్షమును నా కెన్నివిధములుగా బాధాజనకము లగుచున్నవి! నా మిత్రు నేమో రానిచ్చుట లేదు. నా ప్రియురాలిని రానిచ్చునని తోఁచదు. ఏమో! నాకేమి తలంచుకొనినను ప్రాణములు పోవుచున్నవి.

ఈమన్మథుఁ డింతగా నామీఁదఁ గారవములు మీరిన ములు నూరవలెనా? నే మేమి ధూర్జటుల మటోయి, మామీఁద దూకెదవు నీవు?

ఇదివఱ కెట్టివానికిని నే శరణంచు వచింప నీకుఁ బూ
నెద శరణంబు! నవ్యనళినీదళదివ్యశరంబు లేల పూ
నెదవు? కుమారిగంధవహనీతమహార్చులలోన నన్నుఁ ద్రే
ల్చెదు సుకుమార! మార! దయలేక, కృపామతి నాదరింపవే.

అబ్బబ్బ! ఇంక నీవిరహ మెట్లాగుదును? నా శా జగన్మోహిని యెందుకుఁ గనంబడినదో! ఈవిరహము విరహాగ్ని ప్రాణములు త్రుంచుకొనిపోవునా యేమి?

శారద్వతుఁడు: (ప్రవేశించి) ఈ మేఘము లెంతదట్టముగా నలముకొన్నవి! మిత్రుఁడు నాకై యెదురు చూచుచుండును! ఇదియేమి! చీఁకట్లింతగా క్రమ్మినవి! సుపరిచితములైన యీ మార్గములే నాకు దుర్గ్రాహ్యములుగా నున్నవే! అదిగో మెఱుపు! ఒక్కసారి తళుక్కుమని మాయమైనది. కాని త్రోవ మాత్రము చూపినది. ఓసౌదామనీ! నీవలన నభిసారికాకాంతల కెంత యుపయోగము! ఈ నిశాభాగము రమ్యముగానే యున్నది.

నా బట్టలు తడిసి ముద్దలైనవి. మిత్రుని యిల్లు సమీపించితిని.

ఓసి సౌదామనీ! యింక నొక్కకొంచె
మింత మెఱయుము మెఱయు నీ యిల్లు వెండి
గాను బంగారమును గూడఁ గాను ద్వార
బంధ మెట నున్నదో చూపవలయు నంత.

ఎంత మంచిదానవు! సమయమునకు మెఱసితివి. అందుకనియే యమృతమూర్తులగు యువతీరత్నములతోఁ బోల్చుదురు నిన్ను. సఖుఁడా! సఖుఁడ

కీచ: (లేచి) రావోయి సఖుఁడ! వచ్చితివా?

శార: వచ్చితిని.

కీచ: నీకోసము నిమిషములు యుగములుగా గడపుచుంటిని.

శార: ఎవరికోసమో! నాకోసము గాదు.

కీచ: నిజముగా నీకోసము.

శార: నే నేమి స్త్రీనా?

కీచ: ఓయి స్నిగ్ధుఁడా! కాలము గడచుటలేదు. నీవు వచ్చిన గడచునుగదా యని

శార: నేను వచ్చిన గడచునులే. అసలు గడచవలసినది నా కోసముకాదుగద.

కీచ: మిత్రమా! కూర్చుండుము. ఇప్పటికెంత ప్రొద్దు పోయినది.

శార: రాత్రికి రెండుజాములైనది.

కీచ: ఇంత చీఁకటిలో నెట్లు వచ్చితివి?

శార: నే నొక్కఁడనే రాలేదు.

కీచ: మఱి యెవరితోఁ గలసి వచ్చితివి.

శార: ఒక ఖేచరాంగినతో.

కీచ ఆమె యెచ్చట? ఏదీ?

శార: ఇంతవఱకు వచ్చి వెనుదిరిగి పోయినది.

కీచ: అయ్యో! ఆమె యెట్లున్నది? ఎవ రామె?

శార: ఎట్లున్నది? ఎవ రామె? ఎంత యందకత్తె.

ఆ లలితాంగి చారుమధురాకృతి సాటి యనంగవచ్చు శం
పాలలితాంగి, యా మధురవక్రమనోహరనీలకుంతలన్
నేలలితాంగిఁ బోల్పదగు లేకిడు తెల్లని కన్నెతమ్మి యం
దాలకుఁ బుల్కలా సతి సుధామృగసంతవిలాసవైఖరుల్.

కీచ: ఆమెను నాకుఁ జూపించవా?

శార: ఎచ్చటఁ జూపింపను?

ఆశాంతంబుల సాంధ్యకాలముల నీలాంభోదగర్భంబునం
దా? సానందచరన్మధువ్రతకులోత్తంసాపలీగాయమా
నాశాగీతములందునా? యుదయవేళాంచత్సితాంభోద మా
కాశప్రాప్తిగసంతరోచులన,! లేకన్ బ్రేమకున్ లోనునా!

కీచ: ఓయీ! నన్నెందుకు వేధించెదు?

శార: అబ్బో! స్త్రీని జూడకయే నీ కెందు కెంత విరహము?

కీచ: మిత్రమా! అట్లుకాదు. నే నీనాఁ డొక జగన్మోహినిని జూచితిని. ఆమెయు ఖేచరాంగనయే. వచ్చినదేమో యని యడుగుచున్నాను.

శార: ఆమె యెవరో నాకేమి తెలియును! నా వెంట వచ్చిన యామెను జూపెదను. ఆమె యేమో గుర్తుపట్టుకొనుము.

కీచ: మఱి యామెను జూపింపుము.

